# శ్రీ జాషువకవిగారి ఖండకావ్యములు

| | | | | |
|---|---|---|---|---|
| ఖండకావ్యము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 3 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 4 వ భాగము | 1 | 4 | 0 |
| గబ్బిలము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| పిరదౌసి | | 1 | 0 | 0 |
| నేతాజీ | | 1 | 0 | 0 |
| బాపూజీ | | 1 | 0 | 0 |
| కాందిశీకుడు | | 1 | 0 | 0 |
| స్వప్నకథ | | 1 | 0 | 0 |
| ముంటాజ్‌మహల్ | | 1 | 0 | 0 |
| స్వయంవరం | | 1 | 4 | 0 |
| తెరచాటు (నాటకం) | | 1 | 8 | 0 |
| వీరాబాయి (నాటకం) | | 1 | 8 | 0 |

వలయువారు:—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# శృంగార చాటువులు

మాధవపెద్ది
బుచ్చి సుందర రామశాస్త్రి

ప్ర కా శ కు లు
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రా జ మ ం డ్రి

ఏప్రియల్
1952

వెల
రూపాయి

రెండవ ముద్రణ
1000 ప్రతులు

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

మృ త్యుం జ యా !

ఒక బిల్వార్చనయేని వీఁడెఱుఁగునో యొక్కొక్కచో యొంటి మీఁ
దికి నిన్నేఁడులు వచ్చి యొక్క శివరాత్రిం గాని వీఁడుండెనో
యొక మేలాగునఁ జెల్లి వా దెఱచెడిన్ మోక్షమ్ము నిమ్మంచు నేఁ
టికి నామ్రొక్కిన మ్రొక్కె చాలు ననుకొంచేతప్ప మృత్యుంజయా!

ఒక లంబోదరుఁడైన పుత్రకుఁడు మున్నున్నట్టిదే నీకుఁ జా
లక కాబోలును సృష్టిఁ జేసితివి యీ లంబోదరుం గూడఁ దీ
గకుఁ గాయల్ బరువౌన-కాని, కుడుముల్ గల్పించి యవ్వాని కే
లొకొయివ్వానికినొక్కమైనియిడుమల్మొల్పింతుమృత్యుంజయా!

ఒకనిన్ మించిన యోధుఁ డింక నొకఁడయ్యున్ జంపనేలేక చం
పుకొనం జొచ్చిరి రోషవేషముల నామూలమ్మునం జేసి నీ
దు కృపాలోకన మాశనిన్ భుజసమేతున్ సౌమ్యుఁగావించి పా
పికె పాపంబనిపించు పాఠమును మప్పెంగాదె మృత్యుంజయా!

శృంగార చాటువులు

సుకమున్ గష్టమటంచు నెంచుకొను రోజుల్ వోయి యేమాదునో
యిఁక నీ దేహమునుండి జారుకొనగానే కొఱ్ఱగింజంత యన్
పికరేపట్టి పలార్చు కాలమొకఁ డావేశించెడిన్ హస్తమ
స్తక సంయోగమునన్ గుదిర్చి దరిజేర్చన్‌రాద మృత్యుంజయా!

నరజన్మం బెటు లిచ్చితో పశుపతీ! నాకన్నఁ బశ్వాదులున్
మెఱుఁగే యెన్ని విధాలఁ జూచినను స్వామీ! ముందు చేజారు నీ
పొరబాటున్ సవరించుకోనయిన సద్బుద్ధిన్ బ్రసాదింప వి
త్తెఱఁగౌ పాలన యిందె కాక మఱియెందే కద్ద మృత్యుంజయా!

సరిలే! మానవకోటి యీ వెలుపలన్ సంసార చక్రాననే
దొరలన్ లేకిటులుండ లో నొకటి రెండున్ గావె షట్చక్రముల్
వరుసన్ జేర్చి బిగించినావుగద అబ్బా! నాగపాశాలతో
దరియింపన్ దరమౌనె నీ కరుణచేతన్ గాక మృత్యుంజయా!

ఎఱుఁగన్ విన్నవకాశ మెక్కడిది ముందీ ముక్కునంబోవు నూ
పిరినే యెంత విశేషమున్న యదియో విశ్వప్రయత్నమ్మునన్
గుఱుతింపంబడు నాటికే ముగియవే నూఱేడులుం గూడ నే
విరమింతున్ జతనమ్ము నీకునయి నీవే రావె మృత్యుంజయా!

ఏ(బైకిన్ దెగ(బండితుండనను పేరే గాని నాలోని కే(
బో( బోవంగను జెప్ప లజ్జయయిపోవున్ నేను నా బుద్ధికే
యే బొడ్డూడని బిడ్డనో యగుదు తం(డ్రీ ! నిక్క మీపాటిదే
నా బండారము (త్రోవ నీ విడక యున్నంగాదు మృత్యుంజయా !

ఈ చిత్తమ్ము గురూపదేశవిధిగా నే నిల్ప(గా( జాల నా
శ్రీచ(క్రమ్మున నిన్ను నేదొ యొక చిద్బిందు స్వరూపమ్ముగా
నా చూపుం బరగింప( జాల( గరుణన్ నా(పాణ లింగమ్ముగా
నా చుట్టుం దిరుగాడు బిడ్డవయి యున్నం జాలు మృత్యుంజయా !

నీ నామమ్ము జపమ్మొనర్చిన కొలందిన్ విశ్వగానమ్ముగా
నానాటన్ బరిణామమొంది యటుపైనన్ (బహ్మగానమ్ముగా
రానున్ రానుధ్వనించి లోన నివు దుల్లాగు నిం కెందునన్
లీనంబౌటకొ తృప్తి యాత్మ కెటులన్ లేదయ్య మృత్యుంజయా !

ఆ కన్పట్టిన ధ్యానము(ద భవదీయాలోకనావాప్తిచే
నీ కన్గప్పెడి యోగని(ద్రయయి తం(డ్రీ ! చిత్త మీనాటికిన్
లోకంబేదొ యికొక్క లోకమయినట్లున్ బొంది కైలాసమై
వైకుంఠం బరచేతనున్న యటులన్ వర్తించు మృత్యుంజయా !

## శృంగార చాటువులు

ఒక కన్‌గ్రుడ్డున నున్న నీలిమను సూర్యున్ జంద్రు సర్వ ప్రపం
చకమున్ రేపగలొక్కమై ప్రతిఫలించన్ జేయుటే గాక త
త్పకల క్రీడ యనంటి పండొలిచి చేతం బెట్టుచున్నట్లు దృ
ష్టికినిం దెత్తువు నీ మహామహిమ కద్దే యొండు మృత్యుంజయా !

## బ్ర హ్మ

నిష్ఠదరిద్ర జీవనము-నెత్తురు నైతము పీల్చు, వట్టి పా
పిష్ఠ ఋణాల బాధయును-పిల్లికె బిచ్చముఁ బెట్టనట్టి కం
కోష్ఠపు గ్రామవాసమును-గొల్లగ నొష్ఠ లిఖించినావురా
జ్యేష్ఠ కులాభిమాన మొక చిన్నము లేదటరా ప్రజాపతీ !

స్రష్టనటంచు నేడ్చెదవు స్పష్టముగాగను త్వష్టవున్ నత
ద్రష్టవు గాక యున్నయెడఁ ద్వత్కులమంతయు వీటఁబుచ్చి మృ
న్నష్టము నామ నష్టము నొనర్చు నికృష్టుల సృష్టిజేతువా ?
కష్టుఁడ జాతులెల్ల గలగాపులగం బొనరింపఁ జూతువా !

వట్టిలఫంగుకేని పడవ్రాతువు తోకలు మాత్ర మాతనిం
గట్టుక పోయినన్ని యవి కల్గుటయే పరమార్థమైనచోఁ
గట్టుము బ్రహ్మపట్టమును గాఁగల బ్రహ్మకు నేఁడె తోకలం
బెట్టుటతోడనే మొదలువెట్టును మానవ సృష్టి సర్వమున్.

శంభూ !

ఒకతే చాలుగదయ్య యేలుకొన నీహోదాకటయ్యా! యొక
ర్తుక నొంటన్ మఱి యొక్కతెన్ శిరసునందుం గట్టుగొన్నావు చా
లక, పైగా మెడనిండఁ బాము లొడలెల్లం బూదెయుంగూడ నీ
మొకమున్ మామొకమేమి రూపమిది శంభూ! ప్రేతభూతప్రభూ!

ఒక కొంచెమ్ముగ నందముండినదా లేదో దారుకస్త్రీల మ
చ్చిక లేకుండనె వెంబడింతు వెదా పిచ్చింజేసి యానాఁడు నీ
విఁక ఆలాశివమెత్తుటీశునకు నీకేయంతయుండంగ నిం
చుక మాకుండుట యెట్లు దోషమనిపించున్ నీకు శంభయ్యకున్.

శృంగార చాటువులు

అది నీకర్మము మూతుకాళ్ల ముసలయ్యల్ ముండమోపుల్ మొదల్
పెదపెద్దల్ వఱకెల్లవారలకు కాఫీలోకమై పోవ నే
మిది యా చాచినచేయి చాచినటుగానే యుంచు కొన్నాఁ విఁకన్
బ్రదుకత్యంతము చేదుమేయు కొఱకేనా నీకు శంభయ్యకున్.

సరి చేదే వలెనన్న నచ్చము డికాక్షన్‌గాని సీ కట్టు ల
క్కఱలే కించుక చేదుచేదుగ ననన్ కాఫీ నాకింతేని శ
ర్కర లేకుండనె యిచ్చు అయ్య రరకప్ కప్ కాఫి యాముండ మో
సిరి చేఁజాచుట కింతతో నయిన స్వస్తింజెప్పి వేంచేసినన్.

సాయీ బా బా

ఈమాత్రమ్మ గ్రహింపవైతివిగదోయీ సాయి ! యా నేతికిన్
ఖామందుల్ మరునాటి తద్దినపు భోక్తల్ వేతెయున్నారు మా
రామున్‌జేయక వెళ్ళనిమ్ము పితృకార్యం బద్ది తీరంగనే
ఏమైనన్ హతశేషమున్నయెడ నీకేయుంచి వడ్డింతులే.

హో వోయీ యిచటన్ మతేమి బుజనమ్మున్ లేదులే! నీకు నే
దో వట్టింగ నివేదనం బిడెడువా రున్నారులే యంచు నెం
తో విస్పష్టముజేసినన్ వినక మాతోనే పెనంగొందువే
యీవైనన్ దెగఁగోసి వైచుకొనలేవే కర్మబంధమ్ములన్.

ధారాపాత్రకు మాటువెట్టక పరధ్యానమ్ముచే దారికే
వారం బోయుటఁజూచి హెచ్చరిక సల్పన్ దోషమా ఆయుషా
ధారంపుం దిరిపెంపు నీళ్లయిన నాధారమ్ము లేకుండ నీ
వీ రోజెట్టుల నారగించెదవో సాయీ! చూతు నాకేమిలే!

పువ్వేదైనను చేత నున్నయెడ నీ పూజార్థమేయైనటుల్
నవ్వం జూపెద వెచ్చటో ఫలమెదో నాకంచు నేఁదెచ్చుకో
నువ్వేళ్ళారెదు నీ నివేదనకుగా నుద్దిష్టమైనట్టు లే
యెవ్వారిచ్చిన వారసత్వమిది సాయీ! నీవె కైకొంటివో!

నిన్నుంజూచుచు నున్న యంతవఱకున్ నిండారియున్నట్లె యుం
డు న్నా పేదమనమ్ము నీవు మొగమట్టుల్ త్రిప్పు నల్లంతనే
చిన్నంబోయిన యట్టుఁబండు నిలునిశ్శ్యేఃమ్ము పోదోకు నీ
పున్నెంబెయ్యెడకోయి సాయి పయనమ్ముల్ మానుమోయీయికన్.

రా మ దూ త

చెడియెన్ నీ వ్యవహారమంతయును నీ చిత్తానుసారమ్మ నిన్
బడిపోనిచ్చుటొ యంకుశమ్మ కెటులైనన్ దెచ్చుటో తేల్చ కే
విడువన్ మార్మసలంగఁ జొచ్చెదవహో! వీరాంజనేయమ్మ న
డ్డెడి నీయంతటి శూరుఁ డేరుపడినాఁడే యబ్బ! యీనాటికిన్.

మది నన్నింతయు సంస్మరింపవను నామాటట్లులుండంగ నే
మొదలే లేనని గూడ రుజ్జెదవు నీ మూలమ్మనన్ మృత్యుతో
నుదయం బస్తమయమ్ము గూడఁ బడలేకున్నాను నే వైదొలం
గెద నన్నంతన నిన్ను మృత్యు వొకటాకిన్ మ్రింగి త్రేన్చుంజుమీ!

అది నీకిప్పుడు విప్పిచెప్పితి రహస్యంబైననుం గూడ న
మ్మెదవా కొండొక కాలముండెదవు భూమిన్ బత్తెముం గగ్గి నా
ముదలన్ నీ తలదాల్తువా యిది మొదల్ పూర్ణమ్ము గావింతువున్
గద రామాయణమున్ మహోత్తమ పురాణ గ్రంథ రూపమ్ముగన్.

జ్యౌతిషము

నీ కొకశేని నేరిచియు నేరని యట్టులు గాని నే నవ
వ్యాకరణమ్ములన్ గరతలామలకమ్ము లొనర్చుకొన్న రం
డా కొడుకున్—వృథాగ నను నవ్వుల పాలొనరింపఁబోకు—నీ
'గోకము బర్డు' తెల్గునకుఁ గూడగ నన్నును గూడ లాగుచున్.

మొదలే వామనమూర్తి వాపయిని డాబున్ దర్పమేమైన చూ
పెదె యీనాటను హంగుగా కడకు క్రాపింగైన లేకుండినన్
నదరే యానదు మండలాధిపతికైనన్ మంచి సంబంధమున్
గుదురంబోవదు—లాభమేమి తలపై గోష్పాద మున్నందుకున్.

జ్యౌతిషము

తుల జనియించి యెందఱు చతుర్గజముల్ గొనఁ బోవరెందు లెం
దులనొ జనించి నోటఁ బడుతుంపురె లక్షలు సేయ వీరభో
గులును వసంతరాయులయి కోటులకున్ బడగెత్తబోవ రెం
దులకు బహూక్తు లింక నెటనో యెటనో యెదొ వ్రాయఁగాఁబడున్.

శృంగార చాటువులు

సుడితిరుగన్ వలెన్ మనకుఁ చుట్టలు చుట్టుక—యేరి వేరివో
పడవలె వచ్చి యాస్తులును పాస్తులు—వెంద్రుకతో బరాబరిన్
దుడుచుకపోయెడిన్ గ్రహగతుల్—మఱి జోస్యమునందె నమ్మకం
బిడు కొనకద్దిచూచుకొను దెచ్చటొ యెచ్చటొ యుండు వ్రాతలన్.

గురుఁడన్నన్ ముదితొక్కు చంద్రుఁడును శుక్రుండన్ననో వట్టి డా
ఫరుముండాకొడుకుల్ కుజుండిఁకను పుంస్త్వంబుండియుంగూడ బం
భరయన్నన్ బడనట్టి గంగులిఁక నప్పల్ కేవలమ్మున్ శనై
శ్చరుఁడున్ గేతుబుధుల్ నిజాన కొక కొజ్జారాహు వింతేటికిన్.

ఒకసూరయ్యకె పల్కు—కొంచెమెదియో యున్నట్లు లేనట్లు వా
నికి కొజ్జాగద దైవచిత్రమటులేనీ కల్గె సంతాన మం
దొకఁడన్నన్ యమధర్మరాజు శనిగాఁ దొక్కండు చెప్పంగ నెం
దుకులే రాహువు గర్భవాసములు రెండున్ రెండు ముత్యమ్ములే.

ఎప్పుడొ ముందు చచ్చినపయిన్ బుటమార్చెద నంచు నన్నదాఁ
జెప్పుచునుండ వానిపయిచేయిగఁ జావగనైన జావనీ
కిప్పుడె చేయు చిత్రవధ యీ శని పూరితిగా శఠించెనా
తప్పదు దుప్పిభోజనము ధాతకు నాతని తాతకేనియున్.

# శ ని గ్ర హ ము

ఒకచోటన్ బుధ సూర్యు లున్నయెడలన్ యోగింపఁగాబోని వృ
శ్చిక లగ్నమ్మునకున్న సూర్యదశ నాచిన్నప్పుడే యేగె నీ
శకముచ్చైర్గతి సాగి యా బుధదశా సంప్రాప్తియే యైనచో
నిక బంగారపు గోడలౌనుగద నా యిల్లెల్ల సూర్యాత్మజా!

ఛాయాపుత్రుఁడ వీవు రాహు వయినన్ ఛాయాస్వరూపుండికే
చాయన్ ద్యోతిలు నాదు రాహుకళ యే ఛాయాపటమ్మందొ కా
కీ యాకారమునందెటో తిరిగిపోయెన్ బ్రొద్దికెట్లున్న నే
మాయెన్ మున్పటిమంచినే నడువనిమ్మా నీశకంబేనియున్.

స్టంటుం బిక్చరుకన్నఁగూడ నధమస్థంబయ్యె మున్ముందు జే
గంటం బోలుచు నీ మహాదశ వెలుంగంజొచ్చు నా జాతకం
బంటన్ విందును జ్యోస్యమున్ బరమసత్యంబన్న యద్దానికీ
ఘంటాకంకణపుం బహూకృతియె తార్కాణమ్ము సూర్యాత్మజా!

నరునే నమ్మగరాదు వృశ్చికమె లగ్నంబైనచోఁ జెప్పఁగాఁ
దరమేకాదిఁక నందులో కడకు సంధ్యామాత్రమీలేని యీ
గురుచండాలపుయోగమా ! బ్రదుకెటుల్ కూలార నేమాయెలే
దొరకున్ మోక్ష మెటేని నాకు వ్యయమందున్ కేతువే హేతువై.

ముగురుం బిల్లలు కాపురాలకరుగన్ మొండెమ్ముగా నున్న యీ
మగయింద్రాణికి రాజయోగమటరా మందేశ్వరా నేటికిన్
నగిపోరా ? యెవరైన విన్న రుచియౌనా ? యెట్టి భోగమ్ములన్
జిగురుంబెట్టున యింక రోకలి, భవచ్ఛ్రీరస్తు గీరస్తులన్.

మ ౦ |

పెట్టితె కుంపటిన్ పొడుము పీలుపుతో పొగపీల్పుకేనియున్
మట్టముఁ జేయుటో యసలె మానుటయో జరిగించుకొందు మె
ట్టెట్టొ పొగాకు మాట యదియేమిటి నోటను వేయువారి కీ
చట్టమె లేదటంచు రిది సత్యమటోయి ప్రధానిపుంగవా ?

డెట్టు రిలీపుదెచ్చితి బడేల్మనిపించితి పెట్టుబళ్లనుం
బుట్టుదలల్ సమూలముగఁ బో; యిఁక నే డెఫిసెట్లతోడి బ
డ్జెట్టులె యాయె నెల్లపుడు టెంపులు యెంత్రెనుసేని నెత్తికిన్
జుట్టితి రాష్ట్రిభిక్షకయి సున్నను జుట్టిననేమి మాకిఁకన్.

వెఱ్ఱిగ నేదియో మొదలువెట్టెద వయ్యెడ మన్నుదిన్న పెం
జెఱ్ఱులలాగు మిన్నకొని చేతులు నెత్తికి వచ్చు మీదటన్
మొఱ్ఱో యటంచు నేడ్చెదము మచ్చట నచ్చట చిచ్చిగొట్టి యా
బొఱ్ఱెలఁ బూడ్చుకో తలకు బుల్మెదు సత్తుగఁ గ్రొత్తపన్నులన్.

గుంటన్ గుండముఁ జూచుకోక యెవఁడో కోయంచు సాగంగ డీ
ల్పంటా యంచును వానితోక వెనుకాలన్ సాగి యవ్వానితో
టంటంటం టటటంట లంట యననొంటన్ బుట్టు జాడ్యంబెయై
యుంటన్ మాకిఁక గొఱ్ఱెదాటునకు నీవోమంత్రివో ? గింత్రివో ?

వశముం దప్పదొకో జనాంగమటులన్ వ్యాఖ్యానముల్‌చేసి యం
కుశమై యుండిన పాలనావిధపుఁ గక్కున్ మొక్కవోఁ జేసినన్
దిశగాగన్ బకనాసిఁ జేసితివి మంత్రిత్వమ్ము నైతమ్ము మా
దశకున్ దగ్గటులే లభించితివిగా ! దచ్చాదియాచారిగా !

# కవనము

కవనమున నిల్లుబంగారు గాకపోగ
నన్నవస్త్రమ్ములకు నేని హాని హాని
అంటినది బ్రహ్మరంధ్రమికైన మమ్ము
వదలి కవనమ్మ! హాయిగా బ్రదుకనిమ్మ!

మేడలకు మిద్దెలకు నేమి పీడవోయె
పిడికెడన్నమ్ముకా గుండె బిక్కుబిక్కు
ఎండమావులు నీరమ్ము లిచ్చునేని
కవనమన్నమ్ముఁ బెట్టు నిక్కాలమందు.

నన్నయ చేదస్తమన్న నోహో యనున్
భీమన్న కెంపు కాపెడసరమ్ము
తిక్కన్న దంతయు కక్కులకళ్లెమే
యెఱ్ఱన్న కేమైన బుఱ్ఱగలదె

శ్రీనాధుఁ డేమిటా చింతాకు చిగురాకు
పోతన దొక్కాటే బుంగపోత
పెద్దన్న యెంతటి దద్దమ్మపనిఁజేసె
తిమ్మన్న కాపైన దమ్ములేదు

బట్టయిన మాత్ర మటు నోట బట్టరాని
పంచకోల కషాయమున్ దించవలెనె
చెప్పిచెప్పియటంచు నోర్ చేసికొన్న
నన్నమించుక కద్దు లేకున్న రద్దు.

## ముసలిముద్ద

కారు వేసుక యాఘమేఘాలమీద
నెగబడినయట్లు పోయెద వెక్కడేమి
కొల్లబోయెర పని యేమి మళ్లబడెర
ఆగి యటు నిల్చు చూపు రవ్వంత సేపు—

అడుగో నిఱుపేద శల్యమాత్రావశిష్టుఁ
డైన ముత్తైఁదు ముసలి ముద్దయ్యె నెంతో
నీ హవేలీకి నీదు జవాహిరీకి
పాప మాతని కష్టమే ప్రాతిపదిక.

హరిహర కష్టముల్ వడి యహో ! యటు తొండలు గ్రుడ్లువెట్టు నూ
సరమును గూడఁ జాది ఫలసాయముఁ కున్ గనిగడ్డజేసి నీ
పరమొనరింప నాతఁ డొక బంగరు పిచ్చుక వైతివీవు న
ప్పరి యెది చేతలేని నిరుపాధికుఁడయ్యె నతండు నేటికిన్.

కొడు కొకడుండి చెట్టువలెగూలెను నీ పెదతండ్రి వామిలోఁ
గడచిన వత్సరమ్మునను గడ్డిని దూయుచుఁ బాము ముట్టలో
గడ మఱి కాచిపోనెడిది కాస్తయు దీఱెను మీదు కొట్టమున్
దుడుచుచుఁ బోట్ల యెద్దొకటి త్రొక్కి కసాబిసిగాగ గ్రుమ్మఁటన్.

ఎవఁడురు దిక్కు వాని కిపు డెన్నఁడొ పోనడచెన్ గృతఘ్నతన్
జవమును సత్త్వ మాతనికి సన్నగిలంగనె నీదు తండ్రి ని
క్కువముగ మీదు కొంపకును గోడికినే బలియయ్యె వాని యూ
కువ సకలమ్ము మీరె బలిగొంటిరి యాతని యాలుబిడ్డలన్.

కొండావారికి నాంధ్రరాష్ట్రమని యొక్కండుండినం జాలు-నె
వ్వం డర్థింపక విశ్వదాత కెదియున్ బాల్యోదు-తత్త్వజ్ఞుడై
గుండాలాగు చరింప నిష్టపడెడిన్ గోపాలకృష్ణుండు-వీ
డండెవ్వండు స్వభావ మీజగము చుట్టంజుట్టఁగాఁ గల్గియున్.

జంబూరావలె సాగిపోవలయు వాచా ఏదిరాబడ్డ లో
కంబందెల్లెడ సాంబమూర్తులకు పొంకం బౌటయేకాక టం
కంబై మాటయు మాట భావమొక బంగారమ్ము గావించుచుం
డుం బట్టాభికి నైజసిద్ధమిటు లుండుంగాదె యెవ్వారికిన్.

ఓర్పే యెందును టంగుటూరు కెది యెట్లుబ్బాత లూగించినన్
నేర్పే కావలె అయ్యదేవరకు దేనింబూనినన్గాని-యో
దార్పే యెంతకు గొల్లపూడికి వితత్తత్త్వమ్ము లివ్వానికిన్
మార్పే యుండగఁబోదు విశ్వజన సామ్రాజ్యమ్ము చేకూరినన్.

శృంగార చాటువులు

చిత్తైపోయెద రెంతపెంతటి ముఖర్జీలున్ బెనర్జీలు త
త్సత్తామాత్రమచేత వేఱొక విశేషంబున్నదేమన్న యా
వత్తున్ కాంగ్రెసుకామెయే యయినటుల్ బాధించు నప్పట్టులన్
తొత్తైనన్ దొరసానియైన నొకటే దువ్వూరి సుబ్బమ్మకున్.

జాడుంజాడును తోపతోపయయినన్ జాలింపఁ బోడెంతకా
జాడింపావలి పక్షమన్న రవయున్ జాలింగొనందిద్ది గొం
డాడం దెల్పుటగాదు నే చెఱకువాడన్ దెచ్చి లోకమ్ము లీ
రేడున్ పట్టముగట్టినన్ ఘనము కానేకాదు తద్ధాటికిన్.

రా య ల సీ మ

సూపం బన్నది చూపు చూపునబడెన్ చోష్యస్వరూపమ్ము దా
దాపైపోయెను చూరు నీళ్లకిఁక నేతన్ వేపుడుల్ కూడనా!
పోపుం బెట్టుకొనంగ నాముదముకే పుట్టన్ గతుల్ లే విదే
పాపంబో నసిదప్పె నెట్టి పయిలాపచ్చీసు సంసారమున్.

తలక్రిందై కలకాపురాలె యిటు పాతాళమ్మునన్ కుక్కమూ
తులవారిన్ దరిసింపఁబోవ నిఁక జిత్తుంగాగితంబేని రా
యలెయిర్ఘోర్స్న మింటనాడగను ఆహా దైనికింబెంతగా
నలఁగన్ జొచ్చె నొకింతయున్ బయికి కానన్‌రాని ముగ్గాడిలో.

చేతన్ చిల్లరలేక వందల కరెన్సీ జేబునందుండి కై
రాతీబాపతువారిచేత కడు మర్యాదస్థులున్ నైతమున్
లేతన్ లేతను మాటలంబడి సురాళింపన్ బడన్ గన్నులన్
జూతున్ కష్టపుఁకాల మెంత తలక్రిందున్ జేసె లోకస్థితిన్.

ముదిచింతాకున విగ్రహాల పులికాపుల్ సాగె గ్రామాల—ఆ
ముదపుం దీపమె లేక కొండగుహలై పోఁ జొచ్చెడిన్ బెద్దపె
ద్ద దివాణమ్ములె—లోకమంత దురవస్థం జెందుచున్నట్టి యి
య్యదన్ రాయలసీమ కష్ట మిఁక శక్యంబౌనె వాక్రువ్వగన్.

బొగ్గున్ నుగ్గుఁ పొగాకుదుగ్గు సయితంబున్ నిప్పులేకుండగన్
బగ్గుంబగ్గున మండుచున్నయది ప్రాణంబుండి యీరీతిగన్
ప్రగ్గంజొచ్చుటకన్నఁ జచ్చుటయె కొంతన్ గొంతమేల్గాదె యీ
కిగ్గాడీ జగడం బిఁకెప్పటికి శక్తింబాసి శాంతించునో

జ పా నా !

పిడికెడు లేవే నీ కడు
పుడక యకార్యమున కెంత కొడిగట్టితి విన్
బిడుగడవ ఓ జపానా !
కడతేరితి వింకమీద గడియలలోనన్.

కనవో రష్యను యుద్ధమందు బ్రతి రంగంబందు నేనీ పలా
యనమంత్రమ్ముకు స్వస్తి చెప్పుటలు నే డా జర్మనుల్, నీవు గూ
డను నేఁ డెల్లియు తోకమట్టఁ నెగబట్టం బోవవో దొంగవే
టున నీపట్టిన దీవులెల్లఁ దిరుగన్ డోకించి క్రక్కించమో.

భూకంపమ్ములె చాల నిన్ మొదటికిన్ బూర్ణాహుతిం జేయ మా
పైకిన్ సైతము దూకినావు రణకంపంబన్న నెట్లుండునో !
నీ కింకన్ పరిపూర్తిగాఁ దెలియులే నీవెంత చైనీయులే
దేకుళ్లన్ నినుఁబెట్టి పెట్టి కడకున్ ద్రిప్పించి మళ్లింపఁగన్.

మరలన్ వంతుకు మూడువంతులుగ జర్మన్‌దేశమున్ మేము రా
టరుడామింగుల పాలొనర్చి యొకమాల్టాఁజేసి బెర్లిన్ను హి
ట్లరిజంబన్నది లోకమందెచట మొల్కాన్ మోడు లేకుండ రూ
పఱగాఁ జేయ జపాన! నీ వికను రావా? కాళ్లబేరానకున్.

## రంగూను

రంగూనా! బెగడొందఁబోవకుమ—బర్మా! మమ్ములం గూర్చి లో
బెంగం బెట్టుకొనంగఁ జెల్లదుసుమా బెంగాల!—యేమాత్రమున్
లొంగుంబాటనియుండఁగూడదెటొ గెల్పుంగొందు, మస్సామ!—యీ
లంగోటా సడలింపమో సియినఫాలా! నిన్ను రక్షింపకే.

సంబాళించుకొనంగదమ్మ మణిపూర్ సంస్థానమా! గొప్ప క
ష్టంబే వచ్చెనుగాని యాయమెరికా చందమ్ము వీక్షించి తే
చెంబర్గున్ వశమున్ బొనర్చుకొన నాజీరక్షణశ్రేణి భ
గ్నంబున్ జేయ ననన్య సాధ్యమగు త్యాగం బెంత గావించెనో.

ఇంకన్ సంశయమా జయమ్ముమనకు ? పో రెన్నాళులో సాగునా ?
ఢింకన్ గొట్టి స్వరక్షణల్ సకలమున్ డిడ్డంకి డీడ్డంకులన్
డొంకన్ వట్టుచునున్న వారెదురు దాడుల్ గూడనా వారి కీ
వంకన్ బాటెదరే రెఱుంగ రెపుడున్ వాయించు మద్దెళ్లెగా !

సకలంబీవె యటన్న యా ముసలొనీ జామాతయైనట్టి కొం
టుకియానోనటు నిర్దయత్వమున గుండుందెబ్బ జంపించు ఘో
ర కిరాతుండయినట్టి హిట్లరును మీఱం జాలు విశ్వాసఘా
తుకుఁ డీనాటికిఁ బుట్టియుండఁ డిఁకమీఁదన్ బుట్టఁబోవం డిలన్.

చేదున్ జేసికొనెన్ వృధా బ్రిటిషు మంచిన్ బోయి యా జర్మనీ
లో దూరెన్ కడకేమొ హిట్లరుకు నిల్వ్యాందోపు నర్పించి దొం
గై దేశానకు నెక్కడో ముసలొని యల్లాడఁగా సాగెడిన్
ఛాదీ మాటకు ముందుగా విఱచు హాందా యెల్ల వమ్మై చనన్.

[4]

## తూర్పు పడమరలు

పొలమే దున్నుటచేతఁగాని మన తూర్పుం బ్రక్క మేచారపు
న్నలునే నచ్చట లేదు వీధిని పురాణంబైన ఏ పగ్గమో
పలుపో వేయక యూరకే వినరు గొప్పల్ కొద్దు లేమంత వా
రలకుం బట్టవు వ్యాజ్యమాడఁ బొలిమేరన్ దాటిపో రంతగన్.

సరికానీ! తరవాణి పచ్చడులతో సంబారు కారంబుతో
వరిగల్ సజ్జల్ జొన్నలే తినెడి యవ్వా రుక్కుకడ్డీల వై
ఖరిగా నుండఁగఁ బూటకొక్క తరహాగా నెంత పట్టించినన్
మెఱుఁగే కాని బలమ్ము పట్ట దసలేమీ! తూరుపాసామికిన్.

చెమటం దీతురు వారు తిన్న దెదియో జీర్ణింపఁగా తీతతీ
తుము చెక్కుం జెమరింపనీము మనమాదోకంబలెన్ శక్తి న
న్నముగాఁ జొచ్చెను పోను పోనవటి కన్నన్ నిచ్చెనల్ ముందె వే
తు మిటన్ వెంపలి చెట్లకంచనెడి గుర్తుల్ దోచు నెన్నేనియున్.

శృంగార చాటువులు

వరియన్నం బనియన్నఁ బండుగను పబ్బం బందునందక్క ము
ట్టరు వారంతగఁ బూటకింక నొక పూటన్ దిన్నచోఁ జేవి చా
కిరియే చేయనె చేయలేరట యశక్తింజేసి మా తూరుపుం
దొర లెల్లప్పుడు దానినే తినుటలేదో యేమి విడ్డూరమో.

చలువంజేసిన వస్త్రమే యచటి యాసాముల్ మహా మేరువుం
బలె భావించుచునుండగా నిచటివార్ మద్రాసు బాంబేలలో
పలి యిస్త్రీయు దిసింపకే కనులకున్ ప్యారీసు లండన్ల త్రో
వల పారింతురు చూపెటుల్ గుదురు సాపత్న్యమ్ము వార్ వీరికిన్.

గదివిండన్ లవుసీనులుండవలెఁ బ్రక్కన్ బైకిఁకన్ సిల్కె త
ప్పదదో పోజట యుత్త పుణ్యముకె సోఫానాపసోపాలు చె
ప్పెద నింకేమని మాటిమాటికిని కాఫీ టీల కైకోశలు
న్నదె పూర్వమ్మున నింత దుర్వ్యయమునల్పాయుష్యమీతూర్పునన్.

పురమాయింపుగఁ ద్రాక్ష పగ్గములు పల్పుల్ వేయఁగా, చాలు వం
కరవోకుండఁగ నాగలిన్ నడపఁ బ్రజ్ఞావంతులేకాని పో
కరు రమ్మీసులదాక నెందులకుఁ బేకస్ రంగు లెన్నున్నవో
యెఱుఁగన్ నేరరు వార లిప్పటికి నేనీ యెంత దౌర్భాగ్యమో.

ధరమందంబో ప్రియంబో పైరు లెటు తత్కాలమ్ము నందున్నవో
సరుకేదెవ్వరియొద్ద నెంతగలదో సర్కారు శిస్తెప్పుడో
కరణంబున్ మునసీపు లేమిగతిగా గ్రామాన వర్తింత్రో యీ
తరహాగా నడచున్ గబుర్లితరవార్తల్ దూరబోవాచెవిన్.

హేలన్ నెత్తికి నేలకున్ మనము బ్రాహ్మీ విశ్వనాథాదులన్
లీలన్ గుడ్డకు గోచి కెల్లరము లాలీ పాప్సు ప్యారీసుకి
క్కీ లీలక్కుల వాడి క్రొత్తలకుఁ ద్రొక్కిళ్ళాడు చిట్లింతగా
డోలాందోళన మొంద వారెఱుఁగ రోటోదిల్ బహారేనియున్.

సరిగా దస్కతె చేతఁగాని క్షపితల్ సన్యాసులుం గూడఁ బా
ర్కారు డ్యూఫోల్డిటఁ జేబులందిడగ లెక్కన్ డొక్క నెన్నేనియున్
దిరుగుళ్ళన్ దిగద్రావగాగల ముసద్దీలేని యచ్చోట వా
టరుమెన్ ఫౌంటెను పేరునైన వినియుండన్ బోవ రీనాటికిన్.

# ఒక ప్రైవేటు

ఎదురుం డున్నెడు వానినైన మఱి తానే గాక గత్యంతరం
బెదిలేకుండిన వానినైన నొకలాగే యొక్కరోకంటనే
చిదుకంబొడ్చును చేతికిన్ దొరకినన్ జిత్రం బిఁకేమన్న నా
యిదియే రెండవ కంటికిన్ దెలియరానీఁ డీగ కాలంతయున్.

వ్యూహం బాతేఁడు శోషణింప నెదియేన్ హోరెత్తి యేలాటి హే
మాహేమీలును గూడ మందగుది ధీమా హుమ్మసుల్ సచ్చిత
ద్దాహం బారిచి భూరి దక్షిణలతో దాసోహమున్ దాసదా
సోహం బౌదుతు త్రాహిత్రాహి యని ప్రాణాచారముల్ చేయుచున్.

అతని యూసెత్తినం బాలు నడలె యడలు
హుమ్మరావున కూబకు నొక్కలాగె;
యేమి హోరాయొ యది యంతగ్రామమయ్యె
నెందునను వాని బావుటా కెదురెలేదు.

కుడుముం చేతికి నీయఁ బండుగనుచున్ గొండెక్కు సంతోషమున్
బడులాగుండెడు శుద్ధ శ్రోత్రియ కుటుంబం బెంత యుద్దండపుం
బిడుగుం గన్నది చూడ మంత యుడుకుం బిండంబెటన్ దాచి రా
యిడికిన్ దాకిడి కూడ్చిపెట్టుకొనిపోయెన్ గొంప లెన్నేనియున్.

ఎపుడే యొక్కరిలోన నొక్కరికెవో యెక్కొల్పులంబెట్ట కూ
రుపునే పున్నదు వాని బండవడ యెరోజేరి దీపమ్ము నా
రుపుటాలోచనా లేక కంటికొౌక కూర్కున్ దెచ్చుకోలేఁడు నే
లపయిన్ వాఁడెటువంటి దుర్విషపువేళన్ బడ్డవాఁడో కదే.

పడదీయున్ ముకుఁత్రాడువోయు నొకదెబ్బన్ దన్నఁజెక్కించు నె
త్తడచున్ గొమ్ములమీఁదఁగొట్టునెదొకయ్యంద్రోయుఁ దీయున్వపన్
దుడుచున్ సర్వము మైల దయ్యెరువలెన్ దోకించు దేకించు నె
య్యెడనేమైనది గూడఁ దా నెఱుఁగనట్లే చాటు నూరంతటన్.

అవుగానీ ! యటువంటి యాతనికె బ్రహ్మభేద్యమై పోయి గాం
దివమై యానెను వచ్చి కంఠమున కుండెన్ విష్ణుచక్రమ్ముగా
వ్యవహారం బొకఁ డద్దముం దిరిగి యా వ్యాఘాత మంతంతకున్
దెవులేలేని మహావ్యథం గుడిపె హత్తేరీ యనే కావలెన్.

## మాధవపెద్ది

తిరుగుళ్లన్ తిఫిరీల్ తఖావతులు వ్రాల్ దిద్దిళ్లనున్ ఫోర్జరీ
వరవళ్ళీమొదలైన లౌక్యమున నెవ్వారేది వాంఛించినన్
తరిఫీతిత్తుమకాని మేమసలు కా దారిం బ్రవేశింపమే
మెఱుఁగన్ రానటు వానిలోని చెమకున్ వీక్షింతు ముర్వీశ్వరా।

వలెనన్నన్ వ్యవహారకాండమున మా వంశమ్ము మర్యాదగా
సలహా లిచ్చునెకాని తాను తలదూర్చంబోదు పైరివేటు మా
టలకే మేమలవాటుగా మొకరితోడన్ వేటాకర్ మైత్రి వా
టిల మా మాధవపెద్దివార మొకగాడిం బోదు ముర్వీశ్వరా।

పదెయిండ్లయ్యెను నింటి కొక్కరుగా బ స్త్రీల నుద్యోగపుం
బదవీ స్వీకరణమ్ముచేతను గడుఁ బ్రఖ్యాతులై యుండుటం
గద మా మాధవపెద్దివంశమున మా గ్రామానకేగాక పే
రొందవెన్ గుంటురి సీమకంతటికి నెంతో వేంకటాద్రిప్రభూ।

## తె నా లి

గోవిందరాజుల శ్రీవారి కెవ్వీడు.
కాణాచి మంత్రి యుగంధరులకు
ఆవాసమేపురం బభిమానధనుఁడైన
మాధవపెద్ది దుర్యోధనునకు
ఎట నివాస మొనర్చు నటకావతంసమ్ము
స్థానమ్మువారి చిత్రాంగిదేవి
ఉందు రెచ్చోట పీయూషవర్షుల పరి
పాటివారలు పులిపాటివారు

క్రాలునే ప్రోలు శ్రీదేవి కంఠసీమ
పేటపేటయు ముత్యాల పేటగాగ
రసజగన్నాథ నటరాజ రంజమాన
మంజుతారాళి అద్దియె మా తెనాలి.

శృంగార చాటువులు

కొల్లల్ కొల్లలు లాభముల్ మనకిఁకఁగా గోటీశ్వరుండైన రాక్
ఫెల్లర్ గిల్లరు క్రిందుసేయ నొక కాఫీహోటలే చాలునం
చెల్లం దెచ్చి తెనాలి బెట్టి ఫలితం బిల్లిల్ల ఛీలొల్లయై
అల్లో లక్ష్మణ యంచు పోవుదురు పయ్యేల్ గొంద రీనాటికిన్.

నిండుం గుండలు కొమ్ము చేనుఁగులు గండెల్ గండెలౌ వారెవో
పుండాకోరుతనాలఁ జొచ్చి సకలమ్మున్ గ్రావడుల్ చుట్టుచుం
బిండారుల్ వలె ధగ్గులట్టులును ఈ పిండమ్ముకై సేయు దు
ష్కాండల్ గాంచిన నెట్టివారికయినన్ గస్సీరు మున్నీరగున్.

ఏ పనులు దప్పినను గాని రేపుమాపు
మా కెనీమా సినీమాల మాట దప్ప
దేల కడుఁ జెప్ప నేటి టాకీలగూర్చి
హస్కు గొట్టగలేని కోఁకికిస్కు లేదు.

పేటన్ పేటను గూడ హోటళులు కాఫీహోటళుల్ హోటలున్
హోటల్లోనను గూడ ఫోనులును ఫోనుం ఫోనునం నైతముం
పైపై టక్కరిబిక్కి గుల్గుబుగులుక్ టాకీల సంగీతముం
రైటో రైటు తెనాలికే తగునులేరా ఆంధ్రప్యారీసనన్.

ఏబాజారున కేగి చూచిననుగానీ వంటపూటిండ్ల గం
గాభాగీరధులేమి చెప్పగల మేకాలమ్మునం దేనియున్
వేజోకన్ దరిసింపవచ్చుగద కాషీ విశ్వనాధాదులన్
నేబుల్ జేయుననున్న నెందును కొఱంతే లే దొకింతేనియున్.

గ్రామమునందు నుండు పెడకట్టితనం బిటఁ జూప వీవు తా
షామరపాయగున్ గఱకుచాలక నత్తలు గొట్ట సాగినన్
వామనగాయగా నమలివైతురు సాదును పల్వాగాని య
శ్లేమరకుందు నాతనికె యిందు నొకింత బజావు దక్కెడిన్.

మాబే యియ్యెడలన్ గిరీశములు రామప్పంతులుల్ సుమ్ము నీ
వీ బస్తీ పితలాటకం బెఱుఁగవేవీ రాకు గ్రామీణుఁడా !
ఆ బారిష్టరు పార్వతీశమటు నిన్నాడించి యాడించి యే
దో బొందంబడఁ ద్రోతురుండవిఁక నెందున్ దాదు ఫిర్యాదులన్.

డొక్కన్ మూరెడు లోతువెట్టుక యెవండో చేయు కష్టమ్ముకై
కక్కుర్తిన్ బడ త్రిప్పి చంపుదుగదా ! గ్రామమ్మునన్ నీవెదో
డొక్కుం గుఱ్ఱపుబండి యంచెఱుఁగ కిందున్ ముందుగాఁ బిల్చి నే
నెక్కంబొమ్మను మేదిచూత మపుడే యేష్యమ్ము బైటం బడున్.

దండిగనుండి దానమును ధర్మమెఱుంగని పల్లెటూరి పే
న్మొండి ఘటమ్ముఁ బట్టుకొని ముందుగ మచ్చికఁజేయ వల్లప
ల్లం డుమికీ కతండె దిగి లంగరునెత్తుక పోవునింక రా
కుండెడి సోదెనే నతని యూరును పేరు నొకప్పు డేనియున్.

## నిర్వేదము

ఒడలిని వంచి పాటు పడకుండిన సొగని కాపురమ్ము పు
ట్టెడు ఋణబాధతో నటమటించెడు దుర్భర జీవనమ్ము ని
ల్కడగన కంతలో దుసికిలంబడు చిత్త మొకం డొనర్ప నొ
క్కడగుచు నుండు నా జననకాల విశేష మివెల్లఁ గూడి దుం
దుడుకు లొనర్చుచుండు నెడ దుస్సహమైన సతీ వియోగ మే
ర్పడెఁ బయిపాటుగాఁ బిడుగుపాటుగ నుండినదేమి యింక జె
ప్పెడి దెదురౌట నంబి తిరువెంగడ మాతని నెత్తి గంపయం
దిడినవి, పిల్లిపిల్లలు పయిం దలచెడ్డ కుమార్తె వాని వెం
బడి యిఁక నామెచే కొఱవిఁ బట్టుట వెల్తురుకోస మింత యె

ప్పుడు శుభకార్యమున్ సలుపబోవు నెడన్ దెలవాటి వాఱకుం
డెడు సమయమ్మునన్ వలయునే యివి యన్నియు నిందునొక్కడొ
క్కడె మఱి యెంతకే నవుసుగాఁ బుటమార్పగ నన్నయట్టులై
యడఁగెను మత్కవిత్వ రచనాతిశయమ్ము సమస్త మన్నిటన్.

## నా గ రి క త

మాయమైపోయె స్వచ్ఛంద మరణ మెపుడొ
దివ్యదృష్టి నశించె పోదెఱుగ రాక
విన మిఁకన్ బరకాయ ప్రవేశ మనుచె
యెంత కెంతగ మారిపోయినది జాతి.

ఇటులటుల్ దిరుగాడనే ఫోర్డు మోటారొ
గడప వచ్చనకు నేగ్రామఫోనొ
అందమ్ముఁ జూడనే హాలందునద్దమో
చిత్తం బిగుర్పనే క్రొత్త ఫిల్మొ

ఎన్నికం గనగ నే జెస్సీను పందెమో
గొప్ప గన్పింపనే గోల్డుఫ్లేకొ
కాలమ్ముఁ గడుపనే క్లబ్బుమెంబరుషిప్పొ
యింతయున్ గడువనే వింతఫరమొ

కలిగినం జాలు నున్న బంగారమెల్ల
నమెరికా ఫ్రాన్సు బ్రిటను దేశములు దోచి
దాచుకొన నేమిలే కాకితపు గరెన్సి
బలిసి యున్నది మనకుఁ గావలసినంత.

కనులంజూడదు భార్యయేనియును ఈ కాలస్థితిం బట్టి జ
ర్మను త్రైలంబు జపాను సబ్బమెరికా క్రాపున్ వియన్నా సులో
చనముల్ స్వీడను చేతిబెత్తమును స్విట్జర్లెండు రిస్టావచి ఫా
రెనుడ్రస్ ఫ్రెంచి కటింగు మీసలును ప్యారీస్ ఫాషనే లేనిచో.

బంగాళిబాబు ధోవతికట్టు నేల మ
య్యంగారి యుత్తరీయంపు మడత
సెల్యులాయిడ్ ఫ్రేము స్పెక్టికల్సాప్పుపుల్
స్లిప్పర్సు టార్పెడో షేప్డు పెన్ను

## నాగరికత

వైటు కళ్లిషర్టు హేండ్ కర్చీఫు
రీమోడలు కటింగు రిస్టువాచి
వాకింగు స్టిక్కు నంబరు లైటు స్మెల్ సిక్కు
పెన్సిలు నవల గోల్డుఫ్లేకొ సిజరొ

లేనివాఁ డుండియును గూడ లేనివాఁడె
యున్నవాఁ డేమి లేకయు నున్నవాఁడె
ప్లీడరైన నెంతటి గొప్ప లీడరైన
డాక్టరైనఁ గొమ్ములు దిర్గు యాక్టరైన.

దుస్తు లన్నియును దిండు గలిబులేకాని
జాత్యలంకార సౌష్ఠవము లేదు
ప్రబల సంసార తాపత్రయంబె కాని
తిన్నగాఁ గన్నులు తెఱుఁవలేఁడు
కాపురంబను పేరెగాని యాతని గృహం
బది య రాజకూట మన్నఁ జాలు
నిగజీవనము సర్వము గతానుగతికమై
యుండిననే వాని కునికి గలదు

నడకకొక చందమని లేదు పడకటిల్లొ
కాక యుండినఁ జదువుల గదియొ లేక
రబ్బిషం గొట్టొ యేదొ నిర్ణయము గాదు
భారతీయుని నిజగృహాభ్యంతరమ్ము.

జంతు ధర్మంబైన సరిగ నిర్వర్తింపఁ
    బడమ ప్రాయికముగాఁ బ్రతి గృహమున
ఒడల శక్తి యటంచు నుండినం గద స్వధ
    ర్మమునకుం దగు రక్షణము ఘటిల్లుఁ
గర్మభూమి యటన్న గర్వమేగాని య
    త్యధికమ్ము కులటా జనాభివృద్ధి
యొక సంఘముకొ కులమ్ముకొ చెంద కెంత కా
    లమువారు బైట నిల్వంగలారు

కలుగు సంతానమునకు నెక్కడ శరణ్య
మనునదే లేక వార లల్లాడుచుంట
యూరకే పోదు వారల యుసురు దగిలి
యింత కింతగఁ గ్రుంగిపోయెదము మనము.

బహుళమైనట్టి యుత్పత్తితోఁ గూడనే
సర్వతోముఖ వినాశము ఘటిల్లె
సమధికంబైన యైశ్వర్యంబు మధ్యనే
గర్భదారిద్ర్యాంధకార మలమె
మితిలేని యంత్ర సమృద్ధి యందుననె ని
రుద్యోగ విషయ మారూఢమయ్యె
సంధిపత్రమ్ముల శాంతి భద్రములందె
దుర్భరవైర మావిర్భవించె

ఫణము లెత్తెను దుర్విష ఫణులలీల
టారిపులకే కరాళదంష్ట్రలను జూపె
దగ్ధమైపోవు నింకమీఁదటఁ బ్రపంచ
మార్థికపు వైపరీత్య మహాగ్నిశిఖల.

మునుపటింబలె గ్రామములు పట్టణములఁ బో
షింపలేనంత దుస్థితికి వచ్చె
పట్టణంబులు వానిపై భారపడకుండ
నిజశక్తితో నిల్వనేరకుండ

పల్లెటూళులతోడి బాటుగాఁ బరపతుల్
పట్టణమ్ములును గోల్పడఁ దొడంగె
పేరుచెందిన పెద్దపెద్ద ప్లీడర్లకే
నెలవెళ్ల నూతేండ్లు నిండుచుండె

వృత్తులన్నియు నాశమయ్యెను గ్రమముగ
వత్తిలో జమురట్లు రైతెత్తువడియె
నెంటుచే నెకరమ్ము కంచియ యటన్న
సామెతగ నింటి కెక్కువ సాదరయ్యె.

డాలరుం గూర్చి యాందోళనం బనిలేక
ఫ్రాంకు గూర్చి విచారపడుటె లేక
పౌండుకోసము తలపట్టు పట్టుటలేక
యెన్నుకోసరమెత్తు నెత్తలేక
వలసలే లేవని వలపోతలును లేక
క్రొత్త క్రొత్తలఁ గనుంగొనుటె లేక
యంత్రనిర్మాణ వ్యయప్రయాసలు లేక
యిటు లుంటిమే యను నెఱుకె లేక

పార్కులందుఁ బ్రవర్తింపబడు నరణ్య
జంతుతతివోలె భారతజాతిగూడ
తా మిగిలియున్నయది ప్రాచ్యతత్త్వ విదు లౌ
నర్చ్చ పరిశీలనార్థ మీనాటికేని.

ఋణదాత లంగీకరింప రేమాత్రంబు
పెట్టినట్టి ఋణమ్ము గొట్టివేయ
ప్రకృతమందు ఋణస్థులకు సమర్థతలేదు
నగదు చెల్లించి ఋణమ్ము దీర్ప
ఉభయులమధ్య నేదో సంధి పొసగించు
నధికారమది కోర్టు కసలె లేదు
ఏది తప్పిన తప్పదెట్లున్ ప్రభుత్వంబు
వారి తాతాచార్లగారి ముద్ర

దేశమంతట నీ పరిస్థితి జనించి
బలుపు వాపుల కథ బైటపడియెఁ గాని
కష్టపరిహారమునకు మార్గమ్ము మాత్ర
మెఱుకపడ దెట్టు లున్నదో యీశ్వరేచ్ఛ.

చిన్ని డిస్ట్రిక్టు మున్సిపు కోర్టుపైలంత
డిక్రీలకట్ట డీడిక్కాలగును
సివిలుకోర్టును రిజిస్ట్రేష నాఫీసు తా
లూకా కచేరీలె లోక మిఁకను
అప్పు పుట్టదు వ్యాజ్యమాడ బ్యాంకుల డిపా
జిట్లలో లేదొక్క చిల్లిగవ్వ
ఊరకొందమటన్న నున్న నాలుగు నోట్లు
కాలదోషమున మంగళము పాడు

చేతికేమియు వచ్చి చచ్చేడిదె లేని
కవిలెకుం దోడుగా సాహుకారు పన్ను
వేలు గలవారమను సంబరాలెగాని
కాపురం బీదుటయె కనాకష్టమయ్యె.

ప్రకృతకాలమున జాతికి జాతికిని మధ్య
జరుగు సంఘర్షణ స్పర్ధలైన
దేశమున్ దేశ మార్థిక విప్లవమునుండి
తప్పికో నలువు తంత్రంబులైన

తోడి జపాను ముందుకు సాగి సరుకుతో
నింగ్లండునే ముంచియెత్తునైన
ప్రతి రాజ్యమును ప్రతి ప్రాంతమ్ము ప్రక్క ప్ర
క్కల వేయు టారిపు కంచెలైన

కొంచె మెఱుఁగక తప్పించుకొని తిరుగుచె
జాతి జీవన చరమ లక్ష్యమ్ము గాగ
నెటు లెటులొ పోవ మిగిలిన దెడప దడప
నేల వదలించెదవు స్టూడియోలు వెట్టి.

బహువిధ యజ్ఞార్థ పక్వపురోడాశ
పుణ్య పరిమళాపూరితములు
ప్రబల నైష్ఠిక గృహారబ్ధ దివ్యామృత
చరుచారు గంధ ప్రసారకములు
అనవరతా వ్యాహతాజ్య ధారాహుతి
శిఖిశిఖాహుంకార ముఖరితములు
శ్రవణగృహీతవషట్కార వాచాల
నికట వృక్షావాస శుకకులములు

పావనాశ్రమములు దృష్టిపథమునుండి
స్మృతి పథమునుండి జారిపోయినవిగాని
పొడుచుకొని వచ్చినవి కుక్కగొడుగులట్లు
స్టూడియో లెన్నొ స్థలఖాండ శుద్ధికొఱకు.

మునువేషంబెదొ వేసినాఁడనుటలో మోసమ్ము గావించినాఁ
డని యర్థమ్ము స్ఫురించుచుండెడిది యహో ! యిప్పు డవ్వేసమే
ఘనమైపోయెను వేషమొప్పి తగురాగ జ్ఞానముం గంతముం
డినచో బ్రహ్మరథోత్సవంబె దిగదుడ్పే యెట్టి యుద్యోగమున్.

గోహారు తళుతళుక్కుం జూపుగలవారు
శశివంటి కిన్నర స్వరమువారు
దేవిక తీర్చి దిద్దిన కన్బొమలవారు
నళినంత తీయదనమ్మువారు
సవిత గ్రేసును శీవి నవఘుళించెడివారు
వాసంతి చిఱునవ్వు వన్నెవారు
మిస్సులోచన తల మిగులు నందమువార
లాప్టై కన్నను జాణలైనవారు

కలుగకే పోరు రూపరేఖలనె కాదు
తెలుఁగువా రెవ్వరికి నెందు తీసిపోరు
ఇంతకును దేవకీబోసు శాంతరాము
లంత డైరక్టరులె మృగ్యులైరిగాని

మనకుం జేతడి యాడుచో నొక సినీమాహాలు గట్టించి యు
ద్దైను రాబట్టుటె లాభదాయకము కాదే నప్పు సొప్పెందో పు
ట్టిన నేవర్తకమో నయ మ్మదియు కీడే యెంచుటై వల్ల ద
ప్పిన నేమున్నది తారకం బిఁకను కాఫీహోటలో హోటలో.

మిగిలెన్ కర్మము చాల కించుకగ నేమేన్ చెడ్డ ఏదమ్మిడీ
నగదున్రాని విదేశవర్తకుల నానావస్తు లింటింట మా
నగరానంతగ నొంటఁబట్టినవి హూణ ప్రక్రియల్ ఫ్యాక్టరీ
పొగగొట్టమ్ముల లేచిపోయినవి యెడ్డో వెండిబంగారముల్.

ఆయా పల్లెలలోన నిత్యనియతంబై రచ్చగొట్టంబులన్
సాయంకాలమునన్ బ్రవర్తిలు పురాణ గ్రంథ పారాయణ
స్వీయామూల్య పవిత్ర వీరచరిత ప్రేమాభిమానమ్ములే
మాయంబైనవి కొంతకాలమున కా మాటైన లేకుండెడిన్.

ఇలువాకిళ్ల నొకళ్ల కమ్ముకొని బి. ఏ. లైన మాత్రమ్మునన్
ఫలమేమీ కులమెంత తక్కువయొ లాభంబంత హెచ్చిప్పు డా
దళమున్ వేసుక పుట్టినట్టి సుమహాత్మ శ్రేణి కుద్యోగముల్
సులసూత్రంబులు కోరకుండ దిగివచ్చున్ గొండపై నుండియున్.

ఉదయంబ స్తమయంబునుం దినము నే యుద్యోగిచుట్టో పదిం
బది నశ్వత్థప్రదక్షిణల్ సలిపి సంప్రార్థించి ప్రార్థించియున్
దుదకున్ బ్రాహ్మణ పట్టభద్రులు నిరుద్యోగంబుతో నెందఱో
పదులున్ వందలు వేలు నేడు సఫరై పాడైరి యింగ్లీషునన్.

భృగు వీమాత్రము లోనికిం దిగియె బి ఏ. నంచు భిక్షించుచో
నిగనుద్యోగము మాటటుండ నొకయింతే నుప్పుగల్లైనఁ బు
ట్టగతుల్ లేని యుగమ్ము వచ్చె నిటు లింటన్ మ్రగ్గుటో లేకటుల్
తెగి యేవృత్తికినో చొరంబడుటో తేలెన్ తేటతెల్లంబుగన్.

ఘనమో నీచమొ జీవనమ్ము గడుపంగాఁ బిల్లె కూటంబుఁ బె
ట్టినచోఁ గానులు కాల గిద్దలను వడ్డీ లెక్కలున్ రావలెన్,
దెనుగం దంతటి మాట కేమిటికిగానీ పెద్ద యెక్కంబులై
నను రావాయెను పాప మెంత యవమానంబయ్యె బి. ఏ. యనన్.

అమెరికా కధ్యక్షు డగు రూజువెల్టుకు
పొట్టకోసర మొక రొట్టెగాని
సకల భారత నియంతకు గాంధి కేనియు
వేళ కిన్నియె మేకపాలుగాని
అంతటి డిక్టేట రయిన హిట్లరునకు
భోజనంబునకు కాబేజె గాని
అంతకంటెను గూడ నధికుడౌ ముసులోనీ
గ్రాసమ్మునకు టొమా టోసె గాని

పనియు పాటయు లే కూరబై రవుడుగ
దిరుగు సోమరిపోతు కీ దేశమందు
తీరుతీరుల యెన్నెన్ని తీయములును
ఆటిరా వొక్క పూట సాపాటుకేని.

తేప కొక్కరివైపు తిరిగిపోవుచు నుండు
పోకరాటను వచ్చు జోకరట్లు
నమ్మిన కొంపగుండము వేయు పైయాసు
తుదుచు ఆఖరు చేతి తురుపులాగు

తన యాసఁజూపు పాతాళమ్ము లోనికిన్
దెగిపోవు ముక్కు గుర్తించు కరణి
ఇతరుని యవసరం బింక నెంతకును ఫి
ట్టరుగాని రమ్మీసు వరుసజేయు

ఎసని పక్షము నెగ్గిన నేను చిట్టి
చివర కిస్పేటుజాకిగా సిద్ధపడును
కోటి మహిరావణులు గూడ దీటుగారు
నేటి నవనాగరికు కొనగోటికేని.

ప్యారీసు ఫ్రీలవు ప్రాపగాండావారు
లండను వ్యవహారకాండవారు
మాస్కో విడాకుల మంత్రాంగములవారు
బెర్లిను వెను బీరు పిచ్చవారు
హాలివుడ్ న్యూఫిల్ము నాందోళనలవారు
రోము నానావిధ రుచులవారు
అరబిక్కుదేశ చాంద్రాయణమ్ములవారు
ఎస్కిమో కొక యింత హెచ్చువారు

నాఁడు నాటికి మేపెస్టు నాడియాఁల
నగ్నసౌందర్య మాత్మను నాటి నాటి
తిరిగి సృష్ట్యాది కనుగ యత్నించువారు
నేటి నవనాగరకులలో మేటివారు.

కుంభవృష్టిగ పాలుగురిసెడి యతి బలి
ష్ఠంబైనయట్టి హిస్సారుజాతి
పీలిచి విడుచు నూపిరినె సంగీతమ్ము
తీరు గావించు నెల్లూరుజాతి
కొమ్ములం జెనకు తే కోశమందున లేని
కుల విభూషణము నాగూరుజాతి
కోడెత్రాచటు బుసగొట్టు రోసము పుట్ట
మైసూరు దరి యమృతమహలు జాతి

గోవు మాణిక్యముల మాతృ దైవతముల
స్వర్ణవాహినితో శతాబ్దముల వారి
నంపుచుంటిమి యెటకొ ఖండాంతరముల
కకట యెట్టి దరిద్రనారాయణులమొ.

లాయరైనను మనలాగు మనుష్యుఁడే
మునస బెక్కుడి మహామునియు కాఁడు
వీపున జెడ్జీకి వింజామరయు లేదు
కను కలెక్టరు కరకాల లేదు
బొడ్డున మాణిక్యమును బెట్టుకొని పుట్ట
రెచ్చ పెచ్చటి ప్రభు లెవ్వరేని
నొసటను మూఁడు కన్నులు పొడ్వ వెందు డి
క్టేటరునకును డిక్టేటరునకు

వేపకాయంత తోకతో విశ్వరక్ష
కంతకును వీరభోగ వసంతరాయ
లుద్భవింపఁడు మన వెఱ్ఱి యూహ కాని
యెవ్వనికి వాఁడెపో పరమేశ్వరుండు.

స్థానమ్మువాని బందరు పకోడాలతో
పులిపాటి యాతని బూందితోడ
అద్దంకివాని సేమ్యా పాయసమ్ముతో
సియసార్ క్వైటయి స్క్రీముతోడ

గిరీశం

జొన్నవిత్తులవాని సురల పూరీలతో
కపిలవాయి లక్ష్ము మిక్శ్చర్సుతోడ
దయితా యతని పంచదార హల్వాతోడ
యడవల్లి యాతని వడలతోడ

ఇతరులగువారి వింక నేవేవా తోడ
తెలిచి యుంచఁగఁబడె ఆంధ్రదేశ భవన
నాట్యరంగ మనెడు దుకాణమున కదిగో
పోయి కొనుఁడయ్యె యో భోగపురుషులార.

గిరీశం

గొంగడి పురుగు కట్టింగు మీసలవాఁడు
గంపశ్రాద్ధపుఁ దలకట్టువాఁడు
ఎపుడు కాఫీ దుకాణపు తేవిణీవాఁడు
సిగరు పీలువు బుగబుగలవాఁడు

శృంగార చాటువులు

పై పటారమును లోపల లొటారమువాఁడు
పట్టు దప్పిన ఛలోఖాయిగాఁడు
తుద మొదల్ లేని గాడిద గత్తరలవాఁడు
జలసాలతోఁ బడి చచ్చువాఁడు

తడి యనెడి దున్నచోఁ జేతఁ దుడుము మొదలు
దేవతార్చనవఱ కొక్క తీరువాఁడు
వలను పడకున్న శ్రీశుకు వంటివాఁడు
త్రోవ దొరకిన వట్టి గంధోళిగాడు.

బర్నార్డుషానె ధూపమునకున్ రానీడు
ఠాకూరునే పోయి టాకఁజూపు
బాలగంధర్వకే బాణీ బతాయించు
నాయనాపిళ్లనే దూముఁబట్టు
పట్టాభినే పట్టి పట్టి చూచుచుండు
జవహరు తోడనే సవతుదెల్పు
దేవకీబోసునే తెగ వెక్కిరించును
శాంతరాములకె తూచాలు నేర్పు

ఎట్టి కవి యెట్టి గాయకుండేని యెట్టి
రాజకీయజ్ఞుఁ డెట్టి డైరక్టరేని
యతని బాధనఁ బడ హతాహతమె గాని
బ్రతికి యీవలఁ బడుట స్వప్నమున లేదు.

స్టాలిన్‌కు సోషలిజం బేనె నేర్పితి
ముసులోనీ నామాట కసిదొలగఁడు
హిట్లరు ప్రతిది నా యెటుకమీదనె చేయు
రూజువెల్టునకు నా తోజె తోజు
ప్రతిరాజు నే నన్నుఁ బడి చచ్చిపోవును
ప్రతి నియంతయు నన్నుఁ బట్టి నడచు
ఏషియా యెల్ల జపానె నే నెది యన్న
యూరపే సున్న నే హూష్టన్న

అమెరికన్సు గృహంబులయందె యుండి
యొక్క స్టీమర్లనే సముద్రోదకముల
నడపెదరు గాని నేను మీకడనె యుండి
నడపెద ప్రపంచమెల్ల నానావిధముల.

లండను సర్వమున్ నింతు జనాభాను
పార్యిసు సర్వమున్ ఘోరుకొనును
న్యూయార్కు సర్వ ముజ్జాతలేయాతలు
బెర్లిను సర్వమున్ పోర్లబడును
రోము సర్వంబును రొదపుట్టిపోవును
టోకియో సర్వమున్ మోకరించు
ఎల్ల దొరల్ హిప్పు హిప్పు హూరే హూరేల్
దొరసాని లొక్కటే విరగబడుట

ఇచటి యీ గిరిగాడు కాలిడినఁ జాలు
యూరపున కంతటికిని బ్రహ్మోత్సవంబె
యేషియాకైన నంతియే యిండియాయె
అందు ఈ ప్రాంతమే అధమాధమంబు.

కా ఫి

పిక్కాల్ పట్టుకపోవు ప్రొద్దుటను కాఫీ వచ్చి యీ గొంతుకన్
గ్రుక్కెండైనను జాఱకున్నయెడ నక్కోర్వడ్డ ప్రాణం బోగిన్
రెక్కోగా నది నీదు భక్తతతికేనీ బుద్ధియం దెంతగా
నెక్కోగగ్గెను నీదు నామసుధకంటెన్ గూడ మృత్యుంజయా !

అర కప్పొంటికి బట్టు పై వెడలు నాయాషక్కులోనన్ సపో
ర్టరుగా బ్రక్క మరొక్కఁ డున్నయెడ నట్లాంటిక్కు బార్టర్లు చా
ర్టరుచే ద్రొల్లుచునుండు నొక్కొకని నోటన్ తాహతున్ మించి, యు
ల్పిరి నే నుక్కొనరింప నేది యొక కాఫీగాక మృత్యుంజయా !

విడుచున్ చర్చిలులాగు చుట్టపొగ—నేవేళన్ విడంబోడు చే
గొడుగున్ చేంబరులైను వైఖరిని—వాకోఁ జూచు సాక్షాత్తు లా
యుడు జార్జిపలె—జార్జిపోల్కిఁ గయిసేయం జొచ్చు—కాఫీ నొకా
క్కడు తద్దక్షతయన్న దొక్కటియె మృగ్యంబయ్యె మృత్యుంజయా!

## ఆంధ్ర నాయకులు

రంగా కింక నితఃపరం బనఁగ నిర్లక్ష్యమ్ము ప్రాణమ్ము లై
తాంగంబన్న స్వపక్ష మాతఁ డొక పల్కాడంగ నేరీతి ను
ప్పొంగం జొచ్చునొ, శత్రుపక్ష మటులే బొమ్మాదెడిన్ వాని వా
గ్భంగిన్ విశ్వమె గింగిరాల్ దిరిగిపోవన్ సాగు నొక్కొక్కెడన్

లవమాత్రమ్ము ప్రధాన సూత్రములపై లక్ష్యమ్ము వోనీయ రు
న్నవ వా రాంధ్రులపాలి పున్నెముల పంటల్ వోలె తద్దంపతుల్
తవణింపన్ గనుఁగొంటయే ఫలము కంటన్ పాప యున్నందు కెం
త వయోవృద్ధత యంతగా నవయుగత్వం బబ్బె నవ్వారికిన్.

లేరో నాయకు లెందఱో నడిమిపల్లింబోలువా రెంద ఱు
న్నా రా మాటలలోని రాచతీక మెంతన్ మెచ్చినన్ దీఱునే
వారున్ వారును పైకి బింకమును జూపన్ జొచ్చుటే గాని లో
తారే యెంతటివాఁ డెదుర్ దిరిగినన్ టాసాలు బందే తుదిన్.

ఎవరున్ సాటియె గొట్టిపాటి కిఁక నెందే గానబో మా మనో
జవమున్ చింతమనేనివారికి ముఖస్థంబెల్ల కాంగ్రెస్సు పు
ట్టువు పూర్వోత్తరముల్ స్వదేశమున కెప్డున్ సేవగావించు ఆ
చవికిన్ చాలగ గ్రింది మెట్టు తన సంసారమ్ము కల్లూరికిన్.

గోచారత్వ మహత్వ మన్న నిది యొక్కో-నాఁడు కాంగ్రెస్సు ప్రే
రేచన్ దాన బ్రవేశమై క్రమముగా వృత్తుల్ నిరోధించి త
త్పరిచర్యమ్మున కొండిపర్తికులు లాత్మజ్ఞానులై వీరభ
ద్రాచార్యుల్ సుగృహీతులై రిపుడు తత్త్వానంద నామమ్మునన్.

## గురుదేవులు

ఆయన కేను శిష్యపరమాణువు నౌదునో కానో కాని నా
కే యని కాదు లోకమునకే యటువంటి గురుండు లేనె లేఁ
డీ యొక జన్మమందె యని యేమి నిఘంటు విఁకెట్టి జన్మముల్
వేయిటఁ గాని వేంకటకవి ప్రభువే గురువౌను గావుతన్.

## శృంగార చాటువులు

ఏ భాష్యమ్మున కందదా పలుకు వేఱెవ్వారితో లేదు మా
కా బాంధవ్య మనాది సిద్ధమని మా యాత్మల్ ప్రబోధించు మే
మా బోధామృత నిత్య భిక్ష మహనీయంబైన భాగ్యమ్ముగా
లో భావింతుము చాలు మాకతని సాలోక్యమ్ము సారూప్యమున్.

ముఖమున వెల్వడన్ బహుళముల్ ముఖముల్ గలవాణి సర్వతో
ముఖమగు బుద్ధి సర్వ రసముల్ గుఱియించుచు నాతఁ డిచ్చెడిన్
సుఖసుఖ బోధనామృతము చూఱగొనుండని యంత కెక్కుడౌ
సఖుఁడునుబంధుడున్ గురుఁడు సత్యమికొక్కఁడులేఁడుభూమికిన్.

బాబా యంచును పిల్తు మే మిఁకను దర్బారో గురుగ్రంథ సా
హేబా యంచు బహూకరించెడిని కానీ కొల్వు సింగారమై
యా భద్రాసనమందు మా కతఁడు రాయల్ రీతి చెన్నారు సం
శోభన్ పండితరాయలట్లు ప్రవచించున్ భావవిస్ఫూర్తులన్.

ఆ నా కాటురి వేంకటేశు కవనంబన్ జోతియే మూలమై
లోనన్ ముట్నూరి కృష్ణరాయలిడు వెల్గున్ దోచి వేదాంత ల
క్ష్మీనారాయణు చర్యయే గురువటుల్ శిక్షించెడిన్ మానవ
త్వానన్ గుప్త మొనర్పఁగాఁ బడిన దైవత్వమ్ము గుర్తింపఁగన్.

ఉ య్యా ర

శ్రీరస్తు వేంకటాదర్శ్యై
ప్స్వారాయ మహేంద్ర! పట్టభద్ర! శుభంతే
ధీరస్త్వాయుర్బలమ
స్త్వారోగ్యం ప్రాప్నుయా దితోధిక వృద్ధిమ్.

తమ కారోగ్యమె? బందుగుల్ సుఖులె? మిత్రశ్రేణి కానందమే?
సముఖం బెప్పటియట్టులన్ సుముఖమే? స్వస్థంబె రాజ్య ప్రజా
సముదాయం బెపుడో యొకప్డొక నిమేషంబేని మీ దివ్యచి
త్తము వర్తించునె యీ త్వదాశ్రితునిమీఁదన్ వేంకటాద్రిప్రభూ!

తమ సాహాయ్యపుఁ గల్మినున్న ఋణబంధం బూడ్చి పూర్వంపు టా
శ్రమమందున్ దిరుగన్ బ్రవేశమయి సంస్థానంపు టాస్థానరా
జము విద్వత్కవిగాగ ద్యోతిలు ఘనాశన్ వచ్చి నా నేర్పు చం
దమునన్ విన్నప మాచరించితిని చిత్తంబెట్లొ విద్వత్ప్రభూ!

అప్పారాయ మహీమహేంద్ర ! కవియే హస్తంబు లోకస్థితిన్
దప్పింపన్ నిలుపన్ సమర్థమగుఁ దద్ధస్తమ్మునే శ్రాద్ధపుం
డొప్పం జేయుచుఁ గూటికై తిరుగు నీ దుష్కాలమం దకికిన్
జెప్పం బోలుచుఁ బోచువార లొక మీరే కారె విద్వత్ప్రభుల్.

విప్పారంగను సిద్ధమైన కవితా వృక్షంబు భీష్మమ్ములై
నిప్పుల్ గ్రక్కు బుణాల నార్చుకొని పోనేపోవునో లేక మీ
యొప్పారుం గరుణామృతం బెనసి విద్యోతిల్లునో వేంకటా
ద్ర్యప్పారాయ మహీంద్ర ! యింతకు మదీయప్రాప్తి యెట్లున్నదో.

మడులున్ మాన్యములెల్ల మున్నె తెగనమ్మంబడ్డ వేవేవా యొ
త్తడు లా యప్పులవా రొనర్పఁగఁ దదాదిన్ తారకంబొచు నుం
డెడి యుద్యోగముగూడ నూడెఁ గడు వ్యాధిగ్రస్తమై పోయె నా
యొడ లీనాఁటికి జీవయాత్ర యిఁక నెట్లో వేంకటాద్రిప్రభూ !

బహుకృత వేషులై బ్రాహ్మణు లేనాఁడొ
వలస బోయిరి పట్నవాసములకు
వర్తకు లెల్ల నీవరకంటెనుం గూడ
గరివోయి నిల్చిన గసికలైరి

ఇఁక రేపనెడి మాటయే యున్నదనుకోక
కడమవారలు జలగడుఁగుకొనిరి
బ్రతుక వచ్చిన సఫర్నాసు నాలీసులే
గ్రామమ్మునకు హుమ్మరావు లైరి

వలను దప్పెను స్వగ్రామవాసమునకు
నాశ్రయం బీక తప్ప దెట్లైన నీకు
నాశ్రితామరభూజ ! పర్యాయభోజ !
వేంకటాద్ర్యప్పరాయ పృథ్వీబిడౌజ !

నిరుడీ రోజులలోనె మూలబడి మొంఢింబడ్డ దీ యస్థిపం
జర మింకెప్పటికో విముక్తిపడు కష్టంబన్నఁ కష్టంబొకో
నరకంబే నయమబ్బ ! యుబ్బసముకన్నన్ గ్రిందికిన్ మీది కూ
పిరియే యాతని ప్రాణగొడ్డ మగుచెబ్బే ! యెంత రోతయ్యెడిన్.

జ్వరమూ వచ్చిన రాక కింతకు నదృష్టంబన్న దట్లుండి యా
సరి కాలా వెనుకాడెగాని యొక హెచ్చా ? ఒక్క ప్రాణంబు ద
గ్గఱ లేదే మఱి పెద్ద బిడ్డయని లోగా దక్కు పడ్డందు కీ
శ్వరుఁడే కాచె నిమిత్తమాత్రములు కావా ? మందులున్ మాకులున్.

ఫల మేమీ పడి లేచినందులకు—ఈ పాపిష్ఠుఁడే చూచుకో
వలె నేవేళకునైన లేచి తనకున్ బత్యమ్ము—పానమ్ము బి
డ్డలు కన్విప్పరు—చెల్లిపోయినది పెండ్లం బెన్నఁడో—వెన్క ముం
దల ఈ కష్టము వచ్చెనే యనెడి రక్తస్పర్శ లేదెందునన్.

పదిదా కక్క అలేదు పో; కడకు రూప్యం బర్ధరూప్యంబె చే
బదు లివ్వం డొక మిత్రుఁడైన నెదియో ప్రాపర్టి యుండన్ వలెన్
గద! తీర్పంగలడన్న యాస కిఁక మా గ్రామమ్మునందన్న నా
చదు వేమూలకు రాదు జీవన మెటుల్ సాగింతు విద్వత్ప్రభూ!

కడ! నాటికిఁ గన్నఁ సంతతి కిడంగా నాఁడు నాఁడెల్ల నే
గడనం జేసినదాన నొక్క పదిరూకల్ లేవు పెండ్లీడు పై
బడి యున్నట్టి కొమార్తె లిర్వురును దీపస్తంభముల్ వోలె నా
యెడదం జీల్చుచు నున్నవారు తెరువేదీ! నేంకటాద్రిప్రభూ!

అడుగే మోపగనీని రోగమున నేనల్లాడుచున్ మూయ మూ
కుడె లేకుండెను కాపురంబు గడుపన్ గోర్మష్టి కింటింటికిన్
బడుచున్ లేచుచుఁ బోవలె కెటులనో బందాడుచున్ వచ్చి యి
య్యెడలన్ దేవరవారి పాలఁ బడుటాయెన్ వేంకటాద్రిప్రభూ!

ము క్త్యా ల

తరుణంబందున నీరురాని పొలమున్ ధారాళమౌ వాయువే
కఱవై చీఁకటికోనయౌ గృహము నేకాలంబునున్ రావణా
సుర కాష్ఠంబటు లోపలన్ గుమిఁగొంచున్ మందు భార్యా హతా
స్మరణోపద్రవ దుర్వ్యథాభరము లస్మజ్జీవితాఘాతముల్.

ము క్త్యా ల

పసిగాలిచే చిందిపడునట్టి సెలయేటి
నీటి ముత్యమ్ము మీ నోటి మాట
నీటి ముత్తెమ్ములో నిలిచి వన్నెలు గుల్కు
నుదయరాగమ్ము మీ హృదయర క్తి
ఉదయర క్తికి వేచియుండు రమ్యోద్యాన
తరులతల్ మీదు సంస్థాన జనులు
తరు లతాదులనుండి తెరలు దివ్య పరీమ
ళంబు మీ యీ వంగడంబు వాసి

శృంగార చాటువులు

వాసిగల రేడ వీ వౌటవలన గాదె
వాసిరెడ్డ్యుపనామ మన్వర్థ మయ్యె
ఆశ్రితకవీంద్ర పూర్వపుణ్య స్వరూప
చంద్రమౌళీశ్వర శ్రీ ప్రసాదభూప.

మొత్తంబున్న ఋణమ్ము ద్వాదశశతమ్ముల్ మించియున్ మించదా
విత్తం బంతకు నేమిగాని యొకమై వేటాడెడిన్ నే శిరం
బెత్తన్ బ్రాప్తియె లేనియట్టులుగ రెండేనూఱు లీనాఁడు నీ
చిత్తం బాపయి నా యదృష్ట మిఁక సంక్షేపింతు విద్వత్ ప్రభూ !

స హో ద రా !

ఏడువ వచ్చు పొట్టకయి యింగిలిపీ సెదియో యొకింత యీ
డాడను గాక దేవ గృహమందును దానిని వెళ్లబెట్టుటా
ఈడిచి చెంపకాయ నొకటిచ్చు నియంతలు లేక కావ యీ
పోడిమిలోని కిట్లు దిగిపోయితి వాఖరుకున్ సహోదరా !

పరమశివ ప్రతిష్ఠ నిలుపన్ ప్రభవించెను వీరభద్రుఁ డీ
ధర నొక స్వర్గమున్ సలుప తా నుదయించెను రామభద్రుఁ డా
యిరువురి యట్లుగాక యిఁక నీ వవతారము నెత్తినావు మా
కొకకొక పట్టభద్రుఁడుగ గ్రుడ్డిగుడాలకు పండ్లు తోమగన్.

భాషల నెల్ల లెస్స యనఁబడ్డ స్వభాషను మాటలాడ నా
మోషియ యింటిలో ముసలి మోళ్లను వింగిలిపీసులోనె సం
భాషణ సేయఁగావలెన పండెన పాప మదెల్ల నిట్లు నీ
వేషము నిన్నుఁ జూడ తలవేపన గాయయి పోయె తమ్ముడా!

ముచ్చట

ముదుకండయ్యను ముద్దుగుమ్మ నొకతెన్ మోహించె రీడింగ దే
యిదియై పాపము షోకతాలియునుగానీ షష్టి సంపూర్తియై
పదియింకెన్మిది యేండ్ల గుబ్బెతను చేపట్టెన్ వయస్సన్న య
ట్టిది వైముఖ్యపు హేతువా? మనసు రూషిన్ నిగ్రహం బేర్పడున్.

## శృంగార చాటువులు

పిడిరాతిన్ బురుడించు నాతఁడయినన్ బెండౌను స్త్రీ గాలి సో
కెడి మాత్రాన నదేమొ 'నారిమను' చక్కన్ జూచుచున్నాముగా
గడచెన్ పూర్వవయస్సు పశ్చిమదిశన్ గై వ్రాలఁగాఁ జొచ్చె ని
య్యెడ వర్జించెను బ్రహ్మచర్య మిక నిష్టేమారె నిస్తోకుగన్.

## చౌ చౌ

ఇంక చదువ మలపపేమిటా దీపమ్మ
టంచు జాణయైన యాలి పలుక
పలుకఁజొచ్చె వెఱ్ఱిబాగుల మగడంత
మలప నంటె నేను మలప ననుచు.

చేయి కడుగు నతిథిఁ జీఁకటి మఱుఁగున
భర్త యనుచు బుగ్గ పట్టి యొకతె
అడుగు పచ్చడనుచు నతఁ డిదే మన్నను
విడదు మగని దొంగవేష మనుచు.

గారె కేల చిల్లి బూరెలోపల నేల
బెల్ల మనుచు నొక్క పెద్ద నడుగ
ఆలు మగల కల్పు గోలున కదియొక్క
గుఱుతు తెలిసికోర ! కుఱ్ఱ యనియె.

వెచ్చబెట్టు మనుచు నిచ్చిన పాలను
ఖర్చుబెట్టు మనుటగాఁ దలంచి
కడుపునిండ త్రాగి గుఱ్ఱుమంచును త్రేన్చె
ఒకని నోట గడ్డ నొకఁడు కొట్టె.

నకనకం బడునట్టి దొరకు నొకండు
పిండముల నీయ కుడిచేత తిండి తించు
ఎడమచే మీసమున వేసి యిచట నుండి
నాము మనమని పంపిరా యేమి ? యనియె.

## కాంతయ్య

సోఫా నూరక అస్సు రుస్సురనుకొంచున్ భార్య యందించు—ఆ
కాఫీ గైకొనుచే మహాగగనమౌ కాంతయ్య యీనాఁడు బో
ర్డాఫీసం దొక క్లర్కుగాఁ గుదిరె మాయంబైన యయ్యాస్తితో
సాఫీ యయ్యెను సౌకుమార్యమును పోల్చన్ లేము నేఁ డాతనిన్.

తహసీల్దారుగ నుండి తండ్రి యొకచే దాహార్తి నెన్నెన్నొ ఈ
గ్లహముల్ దోచి గతించు నప్పటి కదేదో కంపెనీలోనఁ గొం
త హరింపై పయి వీనిపాలఁ బడియెన్ దాదాపుగా లక్ష వీ
ని హయామందున మంగళంబు భగవాన్విష్ణుయ్యె తత్సర్వమున్.

అపుడా కాంతయ కంత ద్రవ్యము హతంబై పోవ మూన్నాళ్ళ ప
ట్టపగల్ పట్టఁగలేదు గాని నెల పట్టంజొచ్చె—పాపమ్ము జీ
తపురా ళ్లిర్వదియైదు జిక్కు అది సైతంబున్ దయాధర్మ భి
క్షపు లెక్కం బడిపోయె—ఆపడెడి కష్టంబెంత యేపెక్కెనన్.

స్వయమే పిల్పని తేకె వచ్చి పడి కొంపన్ దోచి తిన్నట్టి—ఎ
ల్లయలన్ కల్లయ లందు నొక్కఁడును నాయన్‌వారలే లేక కాం
తయ నెవ్వారు బహూపకారి యని మున్నగ్గించియున్నారొ వా
రె యనం జొచ్చిరి పైత్యకారి యని నోరే యేది యెట్లాడినన్.

ఒడలికి పూర్తిగా తగులుచుండెను చేతను లేక యుండినన్
తడి ప్రసిడెంటుచేత నెదొ తప్పునకై యిఁక నొక్క ప్రొద్దులన్
గడిపెడు కష్టకాలమున కాంతయ భార్యయు నిండు ప్రొద్దులం
బడె మఱి యేమి చెప్ప భగవానుఁ డెఱుంగును వాని వేదనన్.

సాంబా రిడ్డెను లాదిగా సకలమున్ చాలించియుంగూడ పా
పంబా కాంతయ కెప్పుడో పురుగుతొల్వాన్ ప్రక్క హోటేలు చా
యం బోబోయియు కట్టివేసికొని జిహ్వాన్ కోర్కి లోలోపలన్
సంబాళించుకొనం దొడంగు తన సంసారంపు దీనస్థితిన్.

తొంబన్ తోలుకపోయి హోటళులయందున్ వస్తువుల్ సర్వమున్
దుంబాలా యనిపించి వాఁడు ధనముల్ తూర్పార గావించుటల్
డంబాచారముఁగాని యొక్క యుబలాటంబద్ది యొక్కొక్క పు
ష్టిం బుట్టొందు నొకొక్కరీతిగను వారింపంగ దుస్సాధ్యమై.

శృంగార చాటువులు

ఏ తారామణి విందొ—లేకెదొ గవాయీపాట పల్కుం బసం
దో తప్పన్—మఱి యే నటీనటుల చిందో—బుద్ధి కారూఢమై
వ్రాతన్ మాత్రమె కాక బోర్డున నెవో వాతప్పులున్ వచ్చుటన్
ఖేతాళం డయిపోయె నొక్క ప్రసిడెంటేకాక మేనేజరున్.

ఊడున్ రేపటమాపటన్ భృతికినౌ నుద్యోగ మాయింట నీ
రాడన్ సిద్ధముగాగ నున్నయది యిల్లాలల్ల కాంతయ్యకున్
తాడున్ బొంగ్రము లేకయే పురుడు పుణ్యంబెట్లు వెళ్ళింప ను
న్నాఁడో యీశ్వరుఁ డేమెఱింగెడిని నీ నా యల్లె కాంతయ్యయున్

ప్రొద్దునలేచి యాతఁ డటు బోర్డు మొగంబయి పోవునంతలో
వద్దకు వచ్చె శ్రీముఖము వానికి దుఃఖ మదేడకేగెనో
రుద్దుచు కాలరుద్రుఁ డటు రోషభరమ్మున నొక్కపెట్ట ద
ద్దద్ద యటంచు నిప్పగిది తారసిలెన్ ప్రసిడెంటు మీఁదటన్.

ఒ క మా ట

నెయ్యంబన్న నమశ్శినయ్యకడనే నేర్వన్వలెన్—నెయ్యముౝ
తియ్యంబున్ బొనరింప చేరవలె నాదెళ్ళౝ కుటుంబ్రాయు—లో
లియ్యంబౌటకు మాత్ర మెందు గలదో లింకన్న యద్దానికిౝ
వియ్యన్నన్ సముపాశ్రయింపవలయుౝ, విశ్వాసియౌవానికిౝ.

కవనంబిది యన్నను మూ
ల విరాట్టుదె యాతఁ డొక్క లలినూదెడి యు
త్సవ విగ్రహమాత్రుడ మా
ధవపెద్దిౝ గొల్తు కాళిదాస గుణాఢ్యౝ.

శివుడు శుభమిచ్చి ప్రోచుత
చివుకులకులు నాంధ్ర పబ్లిషింగ్హౌస్ను స
త్కవులన్నను ప్రాణ ప్రా
ణ విధమ్ముగ నుండు ఆదినారాయణునిౝ.

జయమౌ గావుత మిత్రమండలికి-నాశం బౌత శార్మణ్య దు
ర్ణయ సర్వస్వము-భక్తకోటుల మనోరాజ్యంబులందెల్ల హా
యియు నానందము వెల్లిగొల్పుచును స్థాయిన్ దైవరాజమ్ము సా
యియె పాలించుత సార్వకాలికముగా-ఏకాత పత్రమ్ముగా.

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కాంతం కైఫీయతు | 1 | 0 | 0 |
| 2 | కాంతం కాపురం | 1 | 0 | 0 |
| 3 | కాంతం | 1 | 0 | 0 |
| 4 | నేనూ మాకాంతం | 1 | 0 | 0 |
| 5 | మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | 0 |
| 6 | మునిమాణిక్యం కథలు | 1 | 0 | 0 |
| 7 | ఉపాధ్యాయుడు | 1 | 0 | 0 |
| 8 | తిరుమాళిగ | 1 | 0 | 0 |
| 9 | మేరీ కహానీ | 1 | 0 | 0 |
| 10 | దాంపత్య జీవితం | 1 | 0 | 0 |
| 11 | రేడియో నాటికలు | 1 | 0 | 0 |
| 12 | రాధబాబు | 1 | 0 | 0 |
| 13 | శరద్రాత్రులు | 1 | 0 | 0 |
| 14 | రుక్కుతల్లి | 1 | 0 | 0 |
| 15 | యదార్థ దృశ్యాలు | 1 | 0 | 0 |
| 16 | హాస్యకథలు | 1 | 0 | 0 |
| 17 | తల్లిప్రేమ | 1 | 0 | 0 |
| 18 | కథానికలు | 1 | 0 | 0 |
| 19 | దీక్షితులు | 1 | 0 | 0 |
| 20 | తగూ నెం. 1 | 1 | 0 | 0 |
| 21 | వినోద వ్యాసములు | 1 | 0 | 0 |
| 22 | నాస్నేహితులు | 1 | 0 | 0 |

వలయువారు:—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమంద్రి

## శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఉమర్ ఖయాం | 1 | 0 | 0 |
| 2 | బృందావనం | 1 | 0 | 0 |
| 3 | శబరి | 1 | 0 | 0 |
| 4 | పంచవటి | 1 | 0 | 0 |
| 5 | శృంగార చాటువులు | 1 | 0 | 0 |
| 6 | మృత్యుంజయం | 1 | 0 | 0 |
| 7 | సుభాషితము | 1 | 0 | 0 |

## శ్రీ వేదాంతకవిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కెరటాలు | 1 | 0 | 0 |
| 2 | కవితా సంస్థానం | 2 | 0 | 0 |
| 3 | అవ్వాయ్ చువ్వలు | 0 | 12 | 0 |
| 4 | దండయాత్ర | 1 | 0 | 0 |
| 5 | వరదలు | 1 | 0 | 0 |
| 6 | గడుగ్గాయి | 1 | 0 | 0 |
| 7 | చినరసాలు | 0 | 8 | 0 |
| 8 | భగవన్మతభాష్యం 1 వ భాగము | 1 | 4 | 0 |
| 9 | డిటో 2 వ భాగము | 1 | 0 | 0 |
| 10 | నాయుడుబావ | 1 | 0 | 0 |

## శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆంధ్రపౌరుషము | 0 | 6 | 0 |

వలయువారు:—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమంద్రి

అదుగో నిఱుపేద శల్యమాత్రావశిష్టుఁ
డైన ముత్తఁడు ముసలి ముద్దయ్యె నెంతో
నీ హవేలీకి నీదు జవాహిరీకి
పాప మాతని కష్టమే ప్రాతిపదిక.

హరిహర కష్టముల్ పడి యహో ! యటు తొండలు గ్రుడ్లువెట్టు నూ
సరమును గూడఁ జాది ఫలసాయముకున్ గనిగడ్డజేసి నీ
పరమొనరింప నాతఁ డొక బంగరు పిచ్చుక వైతివీవు న
స్వరి యెది చేతలేని నిరుపాధికుఁడయ్యె నతండు నేటికిన్.

కొడు కొకడుండి చెట్టువలెగూలెను నీ పెదతండ్రి వామిలోఁ
గడచిన వత్సరమ్మునను గడ్డిని దూయుచుఁ బాము ముట్టలో
గడ మఱి కాచిపోనెడిది కాస్తయు దీఱెను మీదు కొట్టమున్
దుడుచుచుఁ బోట్ల యెద్దొకటి త్రొక్కి కసాబిసిగాగ గ్రుమ్మటన్.

ఎవఁడుర దిక్కు వాని కివు డెన్నఁడొ పోనడచెన్ గృతఘ్నతన్
జవమును సత్త్వ మాతనికి సన్నగిలంగనె నీదు తండ్రి ని
క్కువముగ మీదు కొంపకును గోడికినే బలియయ్యె వాని యూ
కువ సకలమ్ము మీదె బలిగొంటిరి యాతని యాఁలుబిడ్డలన్.

అదుగో నిఱు పేద శల్యమాత్రావశిష్టుఁ
డైన ముత్తఁడు ముసలి ముద్దయ్యో నెంతో
నీ హవేలీకి నీదు జవాహిరీకి
పాప మాతని కష్టమే ప్రాతిపదిక.

హరిహర కష్టముల్ వడి యహో! యటు తొండలు గ్రుడ్లువెట్టు నూ
సరమును గూడఁ జాది ఫలసాయముకున్ గనిగడ్డజేసి వీ
పరమొనరింప నాతఁ డొక బంగరు పిచ్చుక వైతివీవు న
స్పరి యెది చేతలేని నిరుపాధికుఁడయ్యె నతండు నేటికిన్.

కొడు కొకడుండి చెట్టువలెగూలెను నీ పెదతండ్రి వామిలోఁ
గడచిన వత్సరమ్మునను గడ్డిని దూయుచుఁ బాము ముట్ట—లో
గడ మఱి కాచిపోనెడిది కాస్తయు దీఱెను మీదు కొట్టమున్
దుడుచుచుఁ బోట్ల యెద్దొకటి త్రొక్కి కసాబిసిగాగ గ్రుమ్ముటన్.

ఎవఁడుర దిక్కు వాని కిపు డెన్నఁడో పోనడచెన్ గృతఘ్నతన్
జవమును సత్త్వ మాతనికి సన్నగిలంగనె నీదు తండ్రి ని
క్కువముగ మీదు కొంపకును గోడికినే బలియయ్యె వాని యా
కువ సకలమ్ము మీరె బలిగొంటిరి యాతని యాలుబిడ్డలన్.